శ్రీరస్తు.

అడిదము సూరకవిప్రణీత మని

ప్రసిద్ధిఁ గాంచిన

అడిదము రామకవి రచించిన

# "చెఱువుమీఁద పద్యములు."

అడిదము - రామారావుచే వ్రాయఁబడిన

# "విమర్శనము."

---



వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచే
ముద్రితము.

1913

వెల. రు. 0-1-0

శ్రీ రస్తు.

శ్రీరామాయ నమః.

అడిదము సూరకవిప్రణీత మని

ప్రసిద్ధిఁ గాంచిన

అడిదము రామకవి రచించిన

# "చెఱువుమీఁద పద్యములు."

అడిదము - రామరావుచే వ్రాయఁబడిన

## "విమర్శనము."

మొదటికూర్పు. 1000 ప్రతులు.

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ముద్రితము.

1918

వెల. రు. 0-1-0

శ్రీరస్తు.

# చెఱువుమీఁద పద్యములు.

ఈపద్యములు సూరకవిప్రణీత మని సామాన్య ముగనా డుక. కాని యియ్యది మా కుటుంబములోఁ బారంపర్యముగ వచ్చుచున్న వాడుకకు విరుద్ధము. కాఁబట్టి పద్యములయొక్క కర్తృత్వమునుగూర్చి కొంత చర్చించి యందలిసత్యాసత్యములు చదువరులకు వ్యక్తపఱచెదను. మొట్టమొదట కుటుంబసంప్రదాయము నించుక విచారించెదము:—

ఈ వంశజులచే మూలపురుషుఁడుగ నెన్నఁబడుచు వచ్చిన అడిదము నారప్పకు శ్రీవిజయనగర సంస్థానప్రభులు 'రేగ' యను గ్రామమునఁ గరణికము చేయుటకుఁ గొంతమాన్యమును దయచేసిరి. ఈశ్వరానుగ్రహముచే నామాన్యములు నేఁటికిని నీవంశజుల యనుభవములోనే యున్నవి. అందు నొకకుటుంబము వారు రేగలోనే నివసించుచుఁ గరణికము నేటికిని జేయుచున్నారు. ఆకుటుంబమువారిలో నొకఁడగు రామకవియే యీ పద్యములఁ జెప్పెను.

అడిదమువారి యినాముభూములు 'అనుములచెఱు' వను నొకచెఱువుక్రింద నున్నవి. ఈమళ్లలోఁ గొన్నిటికత్తి యింకొక చెఱువు గలదు. ఈచెఱువు పూర్తిగ నిండినపుడు మిరాసీ యినాంభూములలోఁ గొన్నిమళ్లకు ముంపు గలుగును. — ఆనాఁ

టికాలమున నీరెండవచెఱువు పూ_ర్తిగ నిండియుండ రామకవి మొదలగువారి భూములకు ముంపువలన సస్యనష్టము గలిగెను. అంత రామకవి రేగ గ్రామము గు_త్తదారగుదంతులూరుఅన్నమరాజుతోఁ దనకుఁ గలిగిననష్టమును గూర్చి చెప్పుకొని చెఱువుముంపు తీయింపుమని యతని వేఁడుకొనెను. కానిఅన్నమరాజు రామకవిప్రార్థనలఁ బెడచెవినిబెట్టెను. కవికిఁ గలిగిన బాధ తొలఁగ దాయెను. పిదప రామన తనకుఁ గలిగిననష్టమును గూర్చి తనయేలిక యగువిజయరామగజపతి మహారాజునకుఁ దెలుప నిశ్చయించి యొకయర్జిని పద్యములతో వ్రాసి పంపుకొనెను. ఆపద్యములకే ' అర్జీపద్యము ల' ని పేరు. వాని నిందుఁ బొందుపఱచుచున్నాను:—

సీ. అవధారు ! దేవ ! మహాప్రభూ ! విన్నపం
    బాశ్రితో_త్తముఁడ శుద్ధాంధ్రకవిని
పేరు రామన యింటిపే రడిదమువారు
    మాజాగభూపాలరాజు రేగ
నల్లకృష్ణమహారాయ కాగ్రేసరుఁ
    డెల్లకృష్ణప్పతో నేండుగ్రలచటఁ
గరణికధర్మంబు గల్పించి మాన్యంబు
    దయచేసి రది యాస్పదంబు మాకు
గీ. నదియు నీయేఁడు దంతులూరన్ననృపతి
    న_త్తముఁడు గ్రామమెల్లను గు_త్తచేసి

చెఱువు బిగఁగట్టి ప్రజలు జేజేపడంగ
ముంపుగట్టించె వరిపొట్ట ముంపఁదలచి. 1

సీ. విన్నవించెద నామవృత్తాంత మది కొంత
చిత్తగింపు పరాకు సేయకుండఁ
బాలములో నొకఁడేరువూన్పంగఁ జాలఁడు
గంగాభవానిధాకకును జడిసి
దుక్కిటెడ్లను గొని దున్నుకుంద మటన్న
బదులియ్యఁ డెవ్వఁడు పాఁతనేబు
పజోలియును లేక యింట నుండెద మన్న
పాలుకు వచ్చు గంటాలపన్నుఁ

గీ. దేశమునవారు పొన్నూరు తెన్ను గాదు
పంట పన లేదు గంటాలపన్ను పోదు
మీకు దయ రాదు మునుపటిమిసిమి లేను
అతులగుణదీప విజయరామావనీప. 2

తనయేలికకు పద్యరూప మగునీయర్జీని రామన్న పంపుక న్నను కార్యము లేకపోయెను. గుత్తదారుఁ డగు అన్నమరాజు వలనఁగాని తనప్రభువు లగు విజయనగరాధీశులవలనఁగాని తనకుఁ గల్గినబాధ తొలఁగకపోవుటచే వేఱొండు చేయునది లేక యొక నాఁటి యుదయమున రామన స్నానసంధ్యానుష్ఠానములు నిర్వర్తించుకొని తాటాకు,గంటము చేతఁబట్టుకొని తనపొలమునకుఁ

బోయెను. నీటిముంపుచేత తనసస్యము చెడుట చూచి విచారించి తనబాధ తొలఁగుటకు తనకవితయే శరణ మని యెంచుకొని కుత్తుకబంటినీటిలోనికి వెళ్లి నిలువఁబడి యిట్లు గంగాభవానిని నుతించుచు నొకపద్యమును వ్రాసి, వ్రాసినయాకును నీటిలో విడిచెను. ఆపద్య మెద్దియనః—

సీ. బ్రహ్మాండభాండసంపత్తి కుక్షిని గల్గు
పద్మనాభునిపదాబ్జమునఁ బుట్టి
సకలరత్నాకరస్థాన మై యుప్పొంగు
నంబుధీశునిచరణంబు ద్రొక్కి
పరమతత్వజ్ఞుఁ డై పరఁగుశంతనుమహీ
రమణువామాంకభాగమునఁ జేరి
యఖిలలోకాధ్యక్షుఁ డై మించి విహరించు
శివుజటాజూటాగ్రసీమ నిలిచి

గీ. తనరునీవంటిధన్య కుత్తమము గాదు
పూసపాటిమహాస్థాన భూమియందు
గాలు ద్రొక్కంగ నోడుఁ జండాలుఁ డయిన
గదలు మిటు మాని దివిజగంగాభవాని. 3

ఇట్లు భూషణవాక్యములచేఁ దనకార్యము నెఱవేఱకుండుటను జూచి రామన కుపితుఁడై యాక్రిందిరీతిని గంగను దూషించుచు నాలుగుపద్యములు చెప్పెను:—

సీ. ఆదిభిక్షుం డీతఁ డని కోసి విడియూకుఁ
గొనివచ్చి యిట నిల్వఁగోరితొకొ
జగడాలచీలి వై సవతితోఁ బోరాడి
యూగివ చ్చిచ్చోట డాఁగితొకొ
నిర్జరాంగనలెల్ల నీఅంకు వెలిపుచ్చ
దూబవై యిచ్చోటఁ దూఱితొకొ
బీద బాఁపలఁ గష్టపెట్టుటకై మిన్ను
దొలఁగి యిచ్చోటను నిలచితొకొ

గీ. వలదు ద్విజభూమి కాల్నిల్వ వరుసగాదు
రవ్వ నీ కేల తగదంబురాశి కరుగు
నాతి యతఁడు కాఁడట పిన్ననాఁటిమగఁడు
కదలు మిట మూని దివిజగంగాభవాని. 4

సీ. భావింప నిలువెల్ల భంగంబులే కాని
భంగము ల్తొలఁగు టెప్పటికి లేదు
తిరుగుచో వంకరతిరుగు టింతియ కాని
తిన్నఁగాఁ దిరుగుట యెన్నఁడెఱుఁగ
మొనసి రేయింబగళ్లు మొరయుచుండుటె కాని
మొరయ కూరకయుండు టెఱుఁగ మెపుడు

పాలకల్మి నిరోసి పల్చనగుటె కాని
పలుచనిగతి మాని మెలఁగు టెఱుఁగ

గీ. మనుచు నీలోన నీవైనయవగుణంబు
లరసి లజ్జించి దివినుండ కరుగుదెంచి
నిలువు నీరైననీవిందు నిలిచితో కొ
కదలు మిట మాని దివిజగంగాభవాని. 5

సీ. పచ్చిమాంసము కల్లు భక్షించి మత్తెక్కి
రాణించు తిరుగుపరాంపులైన
గంజాయి గుండ హుక్కాలుడికెడి నీళ్లు
ద్రావి మాన్పడెడు తురష్కులైన
గోవులఁ బడ మొత్తి కోసి ముక్కలు మెక్కు
సమదాంధు లగుకొండసవరులైన
తెరవాట్లు గొట్టి కత్తెరదొంగలై చాల
వాలించు తిరుగుచండాలులైన

గీ. భూసురక్షేత్ర మిది యన్నఁ బోఁ డొకండు
చిన్న పొలములు బ్రాహ్మణక్షేత్రమునకు
ఘాతుకత్వంబు సేయుముష్కరులు గలరె. 6
కదలు మిట మాన్ని దివిజగంగాభవాని.

సీ. కృతకాద్రు లాయెనా కీలోగ్రి ఫణిఫణా
నేక ఫూత్కారవల్మీకచయము
విరిదోఁట లాయెనా కఱకుకంటకకంట
కాంకురవిస్ఫురితాగచయము
పుప్పొఁబాన్పు లాయెనా నవమంజుల శ్వేత
లవణాలవాలమౌ చవుటినేల
బొమ్మరిం డ్లాయెనా భూరిభేకాండజా
ధార మై తనరు కేదారచయము

గీ. నీకు విహరింప వసతు లై నివ్వటిలెనె
చిన్నపొలములు బ్రాహ్మణక్షేత్రమునకు
ఘాతుకత్వంబు చేయుముష్కరులు గలరె
కదలు మిట మాని దివిజగంగాభవాని. 7

ఇట్లు పద్యములు వ్రాసి, వ్రాసినతాటాకులను నీటిలో విడువ నట్టిదూషణను సహించి యచట నిలిచియుండుట యుక్తము కాదని తెలుపుటకో యనఁ జెఱువులోనినీరు గండితెగి పాఁటి సముద్రగామి యయ్యె. కవికిఁ గలిగినబాధ యంతటితోఁ దొలఁగెను. రామన కృతకృత్యుఁ డై పొలమును విడిచి యింటికేఁగెను.

ఈపద్యములయొక్కరచనతో సంబంధించి పారంపర్యముగ నొకవింత చెప్పఁబడుచున్నది. మీఁద వ్రాయఁబడిన యర్జీ

పద్యములలో మొదటిపద్యముయొక్క యెత్తుగీతమునందు "మా పుట్టి ముంపఁదలఁచి" యని ప్రయోగించుటచేతఁ గవికిఁ గళత్రనష్ట మైనదఁట. "వరిపొట్ట ముంపఁదలఁచి" అనిచెప్పనుద్దేశించినను దైవికముగా మాపుట్టిముంపదలఁచి అని ప్రయోగింపఁబడెనఁట. ఈగాథయొక్క నిజానిజములఁ గూర్చి చర్చింప నవకాశమేమియుఁ లేదు. కుటుంబములోఁ దరములవెంబడి వచ్చుచున్నగాథ యగుటచే నిందుఁ బొందుపఱుప సాహసించితిని.

(కర్తృత్వమును గూర్చి చర్చ.)

సూరకవి తనతండ్రి యగుబాలభాస్కరకవి మరణానంతరమున స్వగ్రామ మగురేగను విడిచి చీఁపురుపల్లికి సమీపమున నున్న రామచంద్రపురమును దనకు వాసస్థలముగ నేర్పఱచుకొనెను. అవిషయమును నిర్ధారణచేయుటకు సూరకవిగ్రంథములే ముఖ్యాధారములు. సూరన తనగ్రంథములన్నియు రామచంద్రపుర రామలింగేశ్వరున కంకితమొనర్చెను. ఈశివాలయమున కిప్పటికిని అడిదమువారికోవెల యని ప్రసిద్ధి గలదు. ఇంతియకాక.

చ. గరిసెలు వ్రాఁతగాని మఱిగంపెఁ డెఱుంగము
మన్యదేశముల్, తిరిగి యభీష్టవస్తువులు దెచ్చి
భుజింతుము సార్వకాలముల్, సురుచిరసత్కవిత్వ
నిధి సూరకవీంద్రున కేల గల్గెఁ గం, చరమును

రేగ మేఁకమెడచన్నులవంటివి రెండుమాన్య
ములే. 8

ఈపద్యమునుఁబట్టి సూరకవికి రేగలో మాన్యమున్న దని తెలుచున్నను, కరణికవృత్తిచే జీవనము సేయక కవితావృత్తిచే దేశాటనము చేసి కాలక్షేపము చేయుచు వచ్చె నని మన మనుకొనవచ్చును.

మీఁది యంశములనుబట్టి యాకాలమున రేగగ్రామమునఁ గరణికము చేయుచున్నవాఁడు సూరకవి కాఁ డని యూహింపనగును. అదియునుం గాక మొదటినుండియు ననఁగా— రామకవికిఁ బూర్వము తరువాతను గూడ నీరామకవివంశజులే నేఁటివఱకును రేగగ్రామమునఁ గరణికము చేయుచున్నారు. కాఁబట్టి నీటిముంపువివాదము గుత్తదారుఁ డగుపంతులూరు అన్నమరాజుతో రామకవికిఁ గలిగిన దని చెప్పుటయే సమంజసము. కాని పైయూరనుండి కరణికము చేయని సూరకవికిఁ దీనితో సంబంధము కల దని చెప్పుట సరి కా దని నాయభిప్రాయము. చెఱువుమీఁదిపద్యములుచెప్పిన రామకవియు, లోకప్రసిద్ధిగాంచినసూరకవియు వరుసకుఁ దండ్రికొడుకులు. చదువరులకు నాసంగతి తెలియునిమిత్తము మావంశవృక్షము నీక్రింద వ్రాయుచున్నాను.




దంతులూరు అన్నమరాజునకు రామకవి సమకాలికుఁడుగా నుండనోపు. ఏలయన రామకవి యిప్పటియతనివంశజులకు నాలుగుపురుషాంతరముల క్రిందటివాఁడు. అటులనే దంతులూరు అన్నమరాజిప్పటి యతనివంశజులకు నాల్గుపురుషాంతరములక్రిందటివాఁడు. ఈక్రింద వ్రాయఁబడినవంశవృక్షము లాసంగతి దెలియఁజేయగలవు.

దంతులూరువారి వంశవృక్షము. అడిదమువారి వంశవృక్షము.



మీఁద వ్రాయఁబడినయంశములనుఁబట్టి రామకవి గుత్తదారుఁ డగుఅన్నమరాజునకు సమకాలీనుఁ డనియు నాకాలమున కేఁగ గ్రామమునకుఁ గరణ మనియుఁ జెప్పవచ్చును. ఇదియునుం గాక, మాయింటనుండు ప్రతులలోను,మాయూరిలో నాస్నేహితులయొద్ద నుండు ప్రతులలోను పేరు "రామన" యనుపాతమే కానవచ్చుచున్నది. వీనినన్నిటినిఁబట్టి చెలువుమీఁది పద్యములతో సూరకవికి సంబంధము లేదనియు, వానిని రామకవియే వ్రాసె ననియు నేను పూర్తిగ నమ్మితిని. కుటుంబములో వంశపారంపర్యముగ వచ్చుచున్న వాడుకయే ప్రబలప్రమాణ మని నాయభిప్రాయము. ఇదిగాక సుమారు నలువది సంవత్సరముల క్రిందట కాలధర్మమొందిన అడిదము బాలభాస్కరకవి(ఇతఁడు సూరకవిప్రపౌత్త్రుఁడు) చెప్పిన యీ క్రింది సీసపద్యమువలన "చెలువుమీఁదిపద్యముల" తో సూరకవి కెట్టిసంబంధమును లేదని స్పష్టపడుచున్నది.

సీ. విజయరామక్షమావిభు మెచ్చి భాసిల్లె
ధరణిలో మా ప్రపితామహుండు
గంగాభవానిని గడుదిట్టరై తిట్టి
ఖ్యాతిఁ జెన్నొందె మాతాత యొకఁడు
వెలయంగ మగటిపల్వెంకను బడదిట్టి
తద్గఁ దెగటార్చె మాతండ్రిగారు

ఆకీతిగాదిట్టియనుపురంబునకును
నిన్నుఁ బంపదలంచి యున్నవాఁడఁ

గీ. గాచుకొ మ్మిటు మీఁద నఖండచండ
దారుణోద్దండకవితాగభీరశక్తి
నీతరముగాదు కలహించి నిర్వహింప
చల్లపట్టాభిరామ నీచగుణధామ. 9

ఈపద్యము చెప్పిన బాలభాస్కరకవి చెఱువుమీఁద పద్యములు చెప్పినరామకవికి వరుసకు మనుమఁడు. ఆకారణముచేత నె యతఁడు "గంగాభవానిని గడుదిట్టఁనై తిట్టి ఖ్యాతిఁజెన్నొందె మాతాతయొకఁడు" అని చెప్పినాఁడు. విజయరామగజపతిమహారాజు నాస్థానము నలంకరించినది సూరకవి యని లోకప్రసిద్ధముకదా! ఈమీఁద నుడివినకారణములనుబట్టి చెఱువుమీఁదపద్యములు సూరకవి చెప్పియుండలేదనియు వానిని రామకవియే వ్రాసె ననియు స్పష్టమగుచున్నది.

ఇప్పటికి సుమారు నూటడెబ్బది సంవత్సరములనుండి యీ పద్యములు సూరకవిప్రణీత మని బహుళవ్యాప్తిఁ గాంచినవి. ఇట్టి వాడుక మాకుటుంబములో వంశపారంపర్యముగ వచ్చుచున్నవాడుకకు విరుద్ధముగా నున్నది. అట్టి విరుద్ధమగువాడుక నిలిచియుండుట యుక్తము కా దనియెంచి యొందలిసత్యాసత్య

ములు లోకమునకు వ్యక్తపఱుచుట నావిధి యని తలఁచి యీ విమర్శనము వ్రాసి ప్రకటించితిని. గుణగ్రహణపారీణు లగుసజ్జనులు దీనియందు గల లోపములను మన్నింపఁ బ్రార్థితులు.

విజయనగరము.
**20-2-1913.**

బుధవిధేయుఁడు
అడిదము. రామారావు.



Audi Saraswaty Nilaya Press, Madras.—1913.